# వింత ప్రపంచం

## ప్రకృతిలో వింతలు–విశేషాలు

వంశీ రామరాజు



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్

VINTHA PRAPANCHAM - Wonders in the Nature
By : VAMSI RAMARAJU
Published by : Director & Special Officer, A.P.Balala Akademi,
O/o Jawahar Bal Bhavan, Public Gardens, Hyderabad-500 004.

ప్రచురణ సంఖ్య : 77
మొదటి ముద్రణ : 1993
ప్రతులు : 5,000

వెల : రు. 5-00

ముఖచిత్రం,
బొమ్మలు : లక్ష్మణ్

టైప్ సెట్టింగ్:
ప్రసాద్ గ్రాఫిక్స్
హైదరాబాద్

ముద్రణ :
కళాజ్యోతి
హైదరాబాద్

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
జవహర్ బాలభవన్, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్-500 004

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషి చేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవి రెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

శారదా అశోకవర్ధన్
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి
జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

# ఇందులో

# 1. తాబేలు

ఇంటిముందరకి చేతిలోని గంట వాయించుకుంటూ వచ్చి జంగమయ్యను దూరం నుంచి చూసిన కిట్టూ అడుకుంటున్న వాడల్లా పరిగెత్తుకు వచ్చాడు. ఆ జంగమయ్యకు కిట్టూ వాళ్ళు జోలెలో బియ్యం వెయ్యగానే తను తన దగ్గరున్న శంఖాన్ని ఊదాడు.

కిట్టూ చాలా ఆసక్తిగా చూశాడతణ్ని. కిట్టూకు చాలా ఉత్సాహంగా ఉంది. కాస్త ఆశ్చర్యం కూడా కలిగింది. అయితే ఆ శంఖం ఊదితే శబ్దమెలా వస్తుంది? అసలు దాన్నెట్లా తయారు చేస్తారు? అని ధర్మసందేహం కలిగింది కిట్టూకి. కలగడమేమిటి పరుగెత్తుకుని చేరాడు మామయ్యను.

"మామయ్యా! మామయ్యా! ఆ జంగమయ్య ఊదే శంఖాన్ని దేంతో తయారు చేస్తారు? ఈ శంఖాన్ని నేను మన గుళ్ళో కూడా చూశాను" అన్నాడు.

మామయ్య నవ్వాడు. "శంఖాన్ని ఎవరూ తయారు చెయ్యరురా కిట్టూ! సహజంగా అలాగే సముద్రంలో దొరుకుంది....."

"ఓ- ముత్యపు చిప్పలు, ఆల్చిప్పలు, గవ్వలు- ఇవ్వన్నీ కూడా సముద్రంలో దొరుకుతాయి. కదూ మామయ్యా!..."

"అవున్రా నీకు బాగా తెలుసే...."



"ఊఁ... మరి తాబేలు కూడా నీళ్ళల్లోనే ఉంటుంది. కదూ!....."

"అవును- కానీ ఇప్పుడు నీకు తాబేలు ఎందుకు గుర్తొచ్చింది?....." అన్నాడు మామయ్య!

"ఇవాళ మా క్లాసులో టీచరు తాబేలు బొమ్మ గీయమంది. నాకేమో అంత బాగా చేతకాలేదు,కాని తాబేలు గురించిన కథలన్నీ గుర్తుకు వచ్చినయి....." అన్నాడు కిట్టూ.

మామయ్య నవ్వాడు- "భలేవాడివిరా" అంటూ-

"నక్కజిత్తులన్నీ నా దగ్గరుంటే తప్పించుకుపోయెరా తాబేటి బుర్రా...." అల్లరిగా అంటూ నవ్వేశాడు కిట్టూ.

"ఓర్నీ! అసాధ్యుడివిరా- ఆ కథ ఏమిటో నీకు గుర్తుందా?..."

"ఎందుకు లేదు. చెప్పమంటావా మామయ్యా?"

"ఊఁ చెప్పు వింటాను- ఎట్లాచెప్తావో....."

"ఓ- బాగా చెప్తాను- కథలు చెప్పడంలో నాకెన్ని సార్లు ప్రైజులు రాలేదు- ఓసారి ఒక తాబేలును చూసిన నక్కకు దాన్ని తినాలని బుద్ధిపుట్టింది. అనుకున్నదే ఆలస్యం దాని వెంటబడి కాలితో అణగ బెట్టి నోటితో తిందామని ప్రయత్నించింది.

"కాని ఎంత ప్రయత్నించినా తాబేలుపై ఉండే డిప్ప కొరకుడు పడలేదు.

"తాబేలు మాంసం తినడమెట్లాగో దానికి అర్థం కాలేదు. తాబే లనుకుంది. ఎట్లాగైనా ఈ గండం నుంచి గట్టెక్కాలని. నక్కను చూసి అంది. "నక్కా! నక్కా! నేను ఎండిపోయి ఉన్నాను. నన్ను నీళ్ళ దగ్గరికి తీసుకువెళ్ళి నానబెడ్తే నానిపోతాను. బాగా నానితే నీకు తినడం తేలికవుతుంది."

నక్క నవ్వింది, "అమ్మో! నువ్వు నీళ్ళల్లోకి జారుకుంటే?...."

"ఉహూ..... జారుకోను- నీటి ఒడ్డున నీళ్ళల్లో నన్ను ముంచి నీ కాలితో అణచిబెట్టు...." అంది.

నక్క సరేనంది. నీళ్ళ దగ్గరికి వెళ్ళారిద్దరూ! తాబేలును నీళ్ళలో ఉంచి దానిమీద కాలు అదిమి పట్టింది. నక్క. కొంత సేపటి తర్వాత ప్రయత్నించింది తిందామని - ఉహూ తినడానికి వీలు కాలేదు. "ఇదేమిటి తాబేలూ" అంది. నక్క. "నేనింకా నా పైభాగంలో నానలేదు. నన్ను తిరగెయ్యి నానుతాను అంది. కాలుతీసి నక్క తాబేలును తిరగెయ్యాలను

కోడమేంటి- అది నీళ్ళల్లో కనిపించకుండా జారిపోయింది. నక్క ఏడుపు మొగమేసుకుని అనుకుంది- "తప్పించుకు పోయెరా, తాబేటి బుర్ర....." అని.

"ఆ ఆ తాబేలు గురించి ఇవాళ తెలుసుకుందాం! తాబేలు అనే ఈ ప్రాణి ఎంత ప్రాచీనమైందో తెలుసా!........"

"ఊఁ హూ తెలీదు మామయ్యా!"

"మనిషి ఈ భూమ్మీద పుట్టి పది లక్షల సంవత్సరాలు మాత్రమే అయింది. కానీ తాబేలు ఈ లోకంలోకి వచ్చి పద్దెనిమిదిన్నర కోట్ల సంవత్సరాలైంది. అప్పట్నుంచి ఈ జీవి ఉంటూనే ఉంది."

"అమ్మో పద్దెనిమిదిన్నర కోట్ల సంవత్సరాలే. నమ్మలేకుండా ఉన్నాను మామయ్యా! ఇంత మెల్లిగా నడుస్తుంది. ప్రాణంలేనట్లే ఉంటుందే. అన్నేళ్ళనుంచి ఉందంటే........నాకూ తాబేలు, కుందేలు కథ గుర్తొస్తోంది నడక అంటే........"

"ఆ తాబేలు మీద కథలు చాలా ఉన్నాయి. అదెంత మెల్లగా నడిచినా, పట్టుదలగా నడచి కుందేలుమీద విజయం సాధించిందా? లేదా?........"

"అవును మామయ్యా! నాకా విషయంలో తాబేలు నచ్చింది. అయితే మామయ్యా! అయితే ఒక తాబేలు ఎన్నేళ్ళు బతుకుతుంది.?

"అబ్బో! తాబేలుది దీర్ఘాయువు అది 200 ఏళ్ళు బతుకుతుంది. ఇంకా కొందరు శాస్త్రజ్ఞుల అంచనా ప్రకారం అది 300 ఏళ్లుకూడా బతుకుతుంది......" చెప్పాడు మామయ్య.

"మరి ఆ పైభాగాన ఉండే డిప్ప సంగతి ఏమిటి మామయ్యా? తాబేలు ఆ డిప్పలాంటి దానిలో దూరి ఉంటుందా?"

మామయ్య గట్టిగా నవ్వాడు. "తాబేలు డిప్పలో దూరడంకాదు. షెల్ లాంటి ఆ గట్టి దాంతోనే పుడ్తుంది. అది దాని శరీరంలో భాగమే. దాని పైభాగం గట్టిగా దాని మీద బోర్లించినట్లుంటుంది........"

"మూకుడు బోర్లించినట్లు కదూ!"

"ఆ అవును, ఇక శరీరంలో రెండో భాగమైన కింది భాగం కాస్త మెత్తగా ఎముకలతో కూడి ఉంటుంది. తాబేలు తన శత్రువులు ఎవరైనా తనకు హానిచేస్తారనుకున్నప్పుడు తనకు రక్షణగా పైన ఉన్న షెల్ కిందికి తల భాగంతో సహా మెత్తంగా లోపలికి ముడుచుకో గలదు.........."

"చాలా చిత్రం కదూ మామయ్యా!"

"అవును కిట్టూ! తాబేలు జీవితం, జీవితపరిణామం అన్నీ చిత్రమే. ఆడ తాబేలు నీటి ఒడ్డున గుడ్లు పెడుతుంది... ..."

"నేల మీదనా మామయ్యా?"

"ఆ నేలమీదే. అయితే అదెట్లాగంటే, దాని వెనక కాళ్ళతో ఓ గంటలా తవ్వి అందులో గుడ్లను పెట్టి మళ్ళీ మట్టితో కప్పేస్తుంది. అంతే! దాని బాధ్యత అయిపోతుంది- అది వెళ్ళిపోతుంది."

"మరి పొదగడం, పెంచడం?"

"ఉఁ హూ ఆ పన్లేవీ అది చెయ్యదు. సూర్యుడి వెచ్చదనానికి పదిరోజుల తరవాత ఆ గుడ్లులో నుంచి తాబేలు పిల్లలు బయటికి వచ్చి ఆ గుంటలో నుంచి బయట పడి నేల మీదికి, ఆ తరువాత నీళ్ళల్లోకి మామూలుగా పాక్కుంటూ వెళ్ళిపోతాయి. ఇక అప్పట్నుంచే ఏ జంతువులు, పక్షులు తమ జోలికి రాకుండా వాటి రక్షణ అవి చూసుకుంటాయి....."

"తాబేలు కథలే బాగుంటయ్యనుకున్నాను. దాన్ని గురించి తెలుసుకోవడం కూడా చాలా బాగుంది మామయ్యా!" అన్నాడు కిట్టూ.

"ఆ తెలుసుకుంటే ఈ ప్రకృతిలో ప్రతి జీవరాశీ అంతే కిట్టూ. ఆ తాబేలు గురించి ఇంకా ఒకటి రెండు విషయాలు చెప్పాలి. తాబేలుచేసే ప్రతి పనిలోనూ నిదానమే. అది మెల్లిగా నడుస్తుంది. మెల్లగా పెరుగుతుంది. మెల్లగా తింటుంది. చివరికి శ్వాసకూడా చాలా నెమ్మదిగా తీసుకుంటుంది. అసలు కొన్ని తాబేలుగుడ్లు పొదగబడటానికి సంవత్సరం కూడా పడ్తుందట... "

"నిదానమే ప్రధానం అన్నది తాబేలు నీతికదు మామయ్యా....!"

"ఆ కరెక్ట్‌గా చెప్పావురా! చలికాలం వచ్చినపుడు తాబేలు ఏం చేస్తుందో తెలుసా?"

"ఏం చేస్తుందేమిటి?"

"అది నీళ్లల్లో అడుగున ఉన్న మట్టిలో కూరుకుని ఉంటుంది. ఆ సమయంలో దాని శరీరంలో పనులన్నీ మందగిస్తాయి. దీన్ని హైబర్నేషన్ అంటారు....."

"అంటే? అదేమిటి?"

"అంటే సుప్తావస్థ అన్నమాట! శరీరమంతా పూర్తి విశ్రాంతిగా నిద్రావస్థలో లాగా ఉంటాయి. అప్పుడది శ్వాసకూడా ఎంత తక్కువ..... మెల్లగా పీల్చుకుంటుందంటే, అసలది జీవించి ఉందా అనిపిస్తుంది."

"మామయ్యా! మరి అది అసలు అంతగా మట్టిలో కూరుకుపోతే వూపిరి ఎలా ఆడుతుంది? అసలదెట్లా బతుకుంది.?"

"మంచి ప్రశ్న! తాబేలు దానికి కావలసిన గాలిని అది మట్టిద్వారానే పీల్చుకుంటుంది. ఇకపోతే ఇంకో ఆశ్చర్యకరమైన విషయం కూడా చెప్తాను. విను 'గాలపాగాస్' అనే అతిసాధరణమైన తాబేలు బరువెంతో ఊహించగలవా?"

"ఎంతేమిటి?"

"500 పౌండ్ల బరువు ఉంటుంది. అంటే నీకింకా బాగా అర్థం కావాలంటే సుమారు రెండు బియ్యం బస్తాల బరువన్నమాట!"

"అమ్మో! అంత తాబేలే!" కిట్టూ ఆశ్చర్యం ప్రకటించాడు.

"ఇంకా అంతకన్నా ఎక్కువ బరువు తాబేలుకూడా ఉంది. దాని బరువు 1000 పౌండ్లు. అంటే నాలుగు బియ్యం బస్తాలంత బరువు"

"అన్నీ ఆశ్చర్యాలే మామయ్యా! ఇంకా తాబేలు విశేషాలేమన్నా ఉన్నాయా?"

"ఆ విశేషాలంటే గుర్తొచ్చింది. అసలు ముఖ్యమైన ఓ విషయం...... అదే ఓ కథ చెప్పనేలేదు."

"ఏమిటి కథనా? కొత్త కథామామయ్యా నాకు తెలియనిదా?"

"నువ్వు వినివుండవు. పురాణకథ......."

"పురాణాల్లో కూడా తాబేలుందన్నమాట!" కిట్టూ ముఖంలో ఆశ్చర్యం.

"ఆ ఉంది. విష్ణుమూర్తి దశావతారాలు ఎత్తిన విషయం నీకు తెలుసా?"

"కొన్ని తెలుసు మామయ్యా! మత్స్యావతారం, వరహావతారం, నరసింహావతారం......ఇంకా......ఉఁ హు గుర్తురావడం లేదు."

"ఆ అవతారాల్లో ఒకటి కూర్మావతారం"

"కూర్మమంటే"

"కూర్మమంటే తాబేలు"

"ఓహో! విష్ణుమూర్తి తాబేలుగా కూడా అవతారమెత్తాడన్నమాట! అప్పుడు ఆయన ఏంచేశాడు?"

"చెప్తా విను. దేవతలు, రాక్షసులు కలిసి మంధర పర్వతాన్ని ఒక కవ్వంగా, వాసుకి అనే పెద్ద పామును తాడుగా చేసి సముద్రాన్ని మధించారు."

"ఆ ఆ ఒకసారి మా టీచరు చెప్పింది. దేవతలు, రాక్షసులూ సముద్రాన్ని చిలికినప్పుడు అందులోంచి ముందుగా విషం తర్వాత అమృతం పుట్టాయట. కదూ మామయ్యా......!"

"అవునా! సరిగ్గా చెప్పావు. ఆ తర్వాత చాలా కథ నడుస్తుంది. అందులో ముందు పుట్టిన విషాన్ని శివుడు మింగి కంఠంలో నింపుకోవడం, తర్వాత వచ్చిన అమృతాన్ని దేవతలతోపాటు రాక్షసులు కూడా పంచుకోడానికి ఆత్రపడటం, దేవతలు అమృతం పంచుకుంటున్నప్పుడు వాళ్లల్లో రాహుకేతువులుండటం- ఓ, అదంతా చెప్పాలంటే చాలా సమయం పడుతుంది. అదంతా తర్వాత ఇంకోసారి చెప్తాను కానీ అసలు విషయం.....

"ఇందులో ఎక్కడా తాబేలు లేదుగా మరి?"

"వస్తుంది. అదిగో అక్కడికే వస్తున్నాను. దేవతలు, రాక్షసులు సముద్రాన్ని చిలికేటప్పుడు కొంతసేపు గడచిన తర్వాత పర్వతం సముద్రంలో దిగబడిపోయింది. దేవతలకి ఏం చేయాలో అర్థం కాలేదు. అప్పుడు దైవగణమంతా కలిసి విష్ణుమూర్తిని ప్రార్థించారు. ఆయన కూర్మావతారమెత్తి అంటే పెద్ద తాబేలుగా మారి మందర పర్వతం కింద చేరి దాన్ని లేవనెత్తాడు."

"తాబేలుగా మారి అంత బరువు ఎత్తాడన్నమాట..... తాబేలు పురాణాల్లో కూడా ఉందని ఇవాళ తెలుసుకున్నాను మామయ్యా" కిట్టు ఉత్సాహంగా అన్నాడు.

"విజ్ఞానం అనేది అంతులేనిదిరా, తెలుసుకుంటున్నా కొద్దీ ఇంకా తెలుసుకోవలసి ఉంటుంది. ఇవాళ ఎన్నో విషయాలు చెప్పాను. ఇక వెళ్లి అమ్మ పెట్టిన టిఫిన్ తిని చదువుకో" మామయ్య విశేషాలు ముగిస్తూ లేచాడు.

"సరే మామయ్యా! రేపు ఇంకో జంతువు గురించి చెప్పాలి. ఏం.... "కిట్టులో ఇంకా ఎన్నో విశేషాలు, చిత్రాలు తెలుసుకోవాలన్న ఆత్రం కనబడుతోంది.

" ఓ తప్పకుండా చెప్తాగా, అదిగో అమ్మ పిలుస్తోంది. వెళ్లు మరి....." కిట్టు బుద్ధిగా తుర్రుమని లోపలికి పరుగుతీశాడు. *

# 2. ముళ్ళ పంది

స్కూలునుంచి పరుగెత్తుకొస్తూనే సంచీ అక్కడ పడేసి "అమ్మా మామయ్య ఎక్కడ!" అన్నాడు కిట్టూ.

"ఏమిట్రా హడావిడి? మామయ్య స్నానం చేస్తున్నారు." అంది వాళ్ళమ్మ.

కిట్టూ చేతిలో పెన్సిల్ పరిమాణంలో వాడిగా మొనదేలిన ప్లాస్టిక్ పుల్లలాంటింది ఉంది.

"చూడమ్మా! ఇది నున్నగా, ఎంత అందంగా ఉందో" అన్నాడు.

ఇంతలో మామయ్య బయటికి వచ్చాడు. వాడి చేతిలో పుల్లని చూస్తూనే, "ఇదెక్కడిదిరా నీకు ఇది ఏదు ఫంది ముల్లు!" అన్నాడు.

"ఏమిటి? ఇది పందిముల్లా? దీంతో రాసుకుంటారటగా" అన్నాడు కిట్టూ. తన తరగతిలో ఒక పిల్లవాడి తండ్రి ఆటవిశాఖలో అధికారట. వాడు తనకి ముల్లు ప్రజంట్ చేశాడట. చెపుతూనే ప్రశ్నల వర్షం కురిపించాడు.



"నువ్వు మన పూర్వులు గంటంతో రాసేవాళ్ళని చెప్పావుగా మామయ్యా!"

"అవునురా తాటాకులు ఉపయోగించిన కాలంలో ఇనుపగంటంతో రాస్తుండేవాళ్ళు"

"మరి ఏదుపంది ఏమిటి? దాని ముల్లు మన కెట్లా దొరుకుతుంది? దాన్నెట్లా సంపాదించేవాళ్లు?"

"అడవిలో తిరిగే ముళ్లపంది ఒంటినిండా ఇవే! రకరకాల జంతువులకు ప్రకృతి రకరకాల ఆత్మరక్షణ పద్ధతులు కల్పించింది. వీటిల్లో ఏదుపంది వ్యవహారం వింతల్లో వింత. దాని మెడనుంచి వీపుదాకా ఇలాంటి ముళ్ళు ప్లాస్టిక్ చువ్వల్లాగా ఏవుగా, గట్టిగా పెరిగిఉంటాయి!"

"అదేమిటి. మామయ్యా! మరి అవి అట్లా ఉంటే ఏదు పందికి తిరగడం కష్టం కాదా?"

"ఆ మంచి ప్రశ్న. మామూలు సమయాల్లో అయితే ఇవి వెనకవైపు వాలి శరీరాన్ని అంటుకుని ఉంటాయి. కానీ శత్రువు సమీపించగానే ఇది బంతిలా ముడుచుకుంటుంది. ముళ్లన్నీ ఒంటిమీద నిక్కపొడుచుకుని నిలబడతాయి. ఈ రూపంలో దీన్ని చూస్తే ఏనుగులు, సింహాలుకూడా తారెత్తి పరుగుల లంకించుకోవలసిందే!"

"మామయ్యా! మరి ఏదుపంది శత్రువు మీదికి ముల్లు విసురుతుం దటకదా! నిజమేనా మాస్నేహితుడు చెప్పాడు"

"ఊఁహు ఇది ఒట్టి అపోహ. ఐతే మనకి వెంట్రుకలు రాలిపోయినట్లు అప్పుడప్పుడూ దీని ముళ్లు కొన్ని రాలిపోయి. ఆ స్థానంలో కొత్తవి మొలుస్తుంటాయి. మనకి దొరికేవి అవే!"

"మరి మామయ్యా! ఈ జంతువు ఎంత పెద్దదిగా ఉంటుంది?" కిట్టూకి మరోసందేహం.

పిల్లి కన్నా పెద్దదేం కాదు. అయినా ఎలుగులను, తోడేళ్ళను, పురుగులను కూడా ఏదు పంది ముళ్లు విప్పి, ఈ వింత ప్రయోగంతో హడలగొట్టేస్తుంది. ఒకవేళ ఏ జంతువైనా కుక్కుర్తి పడి దీనిపై నోరు చేసుకుంటే, ఈ జిత్తులమారి వెంటనే వెనక్కి తిరిగి వీపు అప్పగిస్తుంది. ముళ్ళన్నీ వాడి కొనలతో ఎదురువస్తాయి. శత్రువు నోటి నిండా ముళ్ళే! ఇంకేం తింటుంది? పాపం, అది ఆకలితో నన్నా చావాలి. లేదా

నోటినిండా అయిన గాయాలు చీముపట్టి చావనన్నా చావాలి." చెప్పాడు మామయ్య- ఏదుపంది శత్రువు ఎదుర్కొనే విధానం వివరంగా!

"మరైతే జంతువుల్లో దాన్ని ఓడించగల జంతువు మరొకటుంది. తాడిని తన్నేవాడి తలతన్నే వాడు కూడా ఉంటాడు కదా? ఒక రకమైన అడవి పిల్లి నక్కినక్కి దీని వెంట పడుతుంది. తటాలున దాన్ని వెల్లకిలా పడేసి ఏ ముళ్ళూలేని పొట్ట పని పట్టి ఆరగిస్తుంది."

"భలే బాగుంది. కానీ మామయ్యా! ఇంకొక్క సందేహం. ఈ ముల్లు దాని శరీరంలో ఎట్లా పెరుగుతుంది.?"

"ఏదుపంది శరీరంలో పెరిగే ముల్లు ఏమిటనుకుంటున్నావు? చర్మం లోంచి ఒక్కటిగా పెనవేసుకుని పెరిగే వెంట్రుకల సముదాయమే ఈ ముల్లు!"

"ఓరి దీని దుంపతెగ! నిజంగా వింత జంతువే ఇది!" అన్నాడు కిట్టూ వినోదంతో సంతృప్తి ప్రకటిస్తూ. *

# 3. చారల గుర్రం

"మామయ్యా! మామయ్యా! "అంటూ పరుగెత్తుకు వచ్చాడు కిట్టూ మామయ్య దగ్గరికి.

ఏదో పుస్తకం చదువుతున్న మామయ్య "ఏమిట్రా నీ హడావుడి? భలేవాడివిరా?" అన్నాడు నవ్వుతూ మామయ్య.

"ఆ హా హా! నా సందేహాలు, నేను తెలుసుకోవలసిన విషయాలు. అదే మామయ్యా! కొన్ని జంతువుల గురించి."

"ఏమిట్రా ఆ చెప్పడం, అతుకుల బొంతలా? సరేగానీ నాకో గ్లాసెడు మంచినీళ్ళు తీసుకురా? చెప్తాగానీ....."

"ఇప్పుడే తెస్తా......" అంటూ లోపలకి వెళ్లి మామయ్యకు మంచినీళ్లు తెచ్చిచ్చాడు కిట్టూ. మామయ్య మంచినీళ్లు తాగి' గ్లాసు బల్లమీద పెట్టగానే అడిగాడు కిట్టూ.

"మామయ్యా! జీవితంలో అసలు నీళ్లే తాగని జంతువుంటుందా?"

"నీకు భలే సందేహం వచ్చిందిరా కిట్టూ! నీళ్లు తాగని జంతు వుంది. కానీ మనదేశంలో కాదు. ఉత్తర అమెరికా నైరుతి ఎడారులలో ఒక



చిన్న జంతువది. అక్కడివాళ్లు దాన్ని 'కంగారూ ఎలుక' అంటారు.

"భలే పేరు. కంగారూఎలుక ఏమిటి మామయ్యా?" ఎప్పుడు వచ్చిందో సుమ ఆశ్చర్యంగా అడిగింది.

"ఆ గమ్మత్తయిన పేరే ఇది. ఆ పేరుతో ఎందుకు పిలుస్తారంటే- కంగారు లక్షణాలు, ఎలుక లక్షణాలు రెండూ దాన్లో కలిసి ఉంటాయి. ఈ జంతువు దాని జీవితంలో ఎప్పుడూ ఒక్క చుక్క కూడా నీళ్లు తాగదు. అది తినే మొక్కలు. దుంపల్లో ఉండే నీళ్లే దానికి సరిపోతాయి. దీని తోక వెనక కాళ్లు కంగారూను పోలి ఉంటాయి. తక్కిన శరీరం, ముట్టె ఎలుకను గుర్తుతెస్తాయి."

"చూడ్డానికి తమాషాగా ఉంటుందేమో కదూ?" కిట్టూ అన్నాడు.

"అవును. ఇది వెనకాళ్ల మీద గెంతుతూ పోతుంది. ఎంత ఖచ్చితంగా దూకుతుందంటే ఒక రక్కైన పాదమీదకు ముళ్ళ మధ్య ఏ హానిలేకుండా దూకుతుంది. వెంట్రుకవాసి తప్పకుండా ఒక మిడత మీద వాలుతుంది."

"నీళ్లు తాగని జంతువుంటుందని నేను కలలో కూడా అనుకోలేదు. మామయ్యా!"

సరే. ఇంకో ప్రశ్న. భూమ్మీద ఉన్న జంతువులన్నీ పరుగు పందెం వేసుకున్నాయనుకో. అప్పుడు ఏది గెలుస్తుందిరా ఏదీ, దీని జవాబు చెప్పు చూద్దాం."

"ఈగ. ఈగ అనుకుంటున్నాను. మాష్టారు చెప్పారెప్పుడో" అన్నాడు కిట్టూ.

"వేగం విషయంలో అది నిజే కాని, భూమ్మీద అన్ని జంతువుల్లోకి అనికదా అడిగాను. మనిషి మహా అయితే గంటకు 25 మైళ్లు. పందెం గుర్రాలయితే గంటకు 50 మైళ్లు పోగలవు. కొన్ని రకాల దుప్పులు 60 మైళ్లు కూడా పోతాయి. కానీ ఇవేవీ పరుగుల రాజుకు ఆమడ దూరంలోకి కూడా రాలేవు. అదేమిటో తెలుసా?"

"ఏమిటి మామయ్యా! ఏం జంతువు" ఆత్రంగా అడిగాడు కిట్టూ.

"చిరుతపులి ఉంది. దాని వేగం గంటకు డెబ్బై మైళ్లు. ఇది ఆసియా, ఆఫ్రికా ఖండాల్లో ఉంటుంది. కొందరు వేటగాళ్లు దీన్ని మచ్చిక చేసుకొని వేట కుక్కల్లాగా ఉపయోగిస్తారు. కూడా! వేట

జంతువు కనిపించగానే దీని కళ్లగంతలు తీసి గొలుసు విప్పుతారు. ఇది ఒక్కసారిగా వెంటపడి దాన్ని పడగొట్టి వేటగాడు వచ్చేదాకా అణచి ఉంచుతుందిట."

"బలేగా ఉందే! సరే, ఇంకో ప్రశ్న మామయ్యా! చాలా రోజుల్నుంచి అడగాలనుకుంటున్నాను. జీబ్రాకు చారలెందుకు ఉంటాయి?"

"మంచి ప్రశ్నరా కిట్టూ! తెలుగులో దాన్ని చారలగుర్రం అంటాము. నిజానికి అది గుర్రం కుటుంబానికి చెందిన జంతువే. ఇంచుమించు తెలుపు లేక బూడిద రంగు శరీరంపై తోకతో సహా ఒక డిజైన్ ప్రకారం దీనికిచారలు శరీరమంతా ఉంటాయి. ఎందుకూ అంటే- చాలా జంతువులకు అడవిలో ఆత్మరక్షణకోసం ప్రకృతి వాటికి ఎన్నో రకాలయిన పదుపాయాలు సమకూర్చింది. వాటిల్లో ఇదో ఉపాయం. ఎండనీడన పొదల్లో జీబ్రా ఉందంటే అది ఉన్నట్లే తెలియదు. పరిసరాలతో అది అంతగా కలిసిపోతుంది. దీని ప్రధాన శత్రువు సింహం. ఆఫ్రికాలో సింహాలు, జీబ్రాలు, ఒకే అడవిలో నివసిస్తాయి కనుక చారల కప్పు వీటికి ఎంతో రక్షణ కలిగిస్తుంది."

"మంచి ఉపాయమే...."

"అవును. మీరు సినిమాల్లో, టీ.వి.లో చూసే ఉంటారు. మన సైనికులు ఏంచేస్తారు? తలపైన ఆకులు కప్పుకుని ఆయుధ వాహనాలను కూడా కొమ్మలతో కప్పి నెమ్మదిగా శత్రువు వైపు ముందుకు సాగుతారు. తలమీద టోపీపైన కూడా ఆకులు పెట్టుకుంటారు. ఈ విధంగా పరిసరాలతో కలిసిపోయినందువల్లే దగ్గరకు వచ్చి ముట్టడించే దాకా శత్రువులు వాళ్లని గుర్తించలేరు."

"జీబ్రాలు నున్నగా, అందంగా ఉంటాయికదా! వాటిని మనం పెంచుకోవచ్చా మామయ్యా!"

"బాగా అడిగావు. ఇది గుర్రం కుటుంబానికి చెందిందయినా దీని బుద్ధులు పూర్తిగా వేరు. ఇది మచ్చికచేస్తే లొంగదు. శిక్షణకూ లొంగే ఘట్టం కాదు. ఊరికే కుమ్ములాడుతుంది. జంతు ప్రదర్శనశాలలో వీరి రక్షకులు అనుక్షణం అతిజాగ్రత్తగా ఉంటారు. ముందుకు తిరిగి కరిచిందో కండలు ఊడివస్తాయి. వెనక్కి తిరిగి తన్నిందో ఏ పళ్లు రాలడమో కాదు. కాళ్లో, చేతుల్లో విరిగి శాశ్వతంగా వికాలాంగులు కావలసిందే" అని మామయ్య అనడంతో సుమ, కిట్టూ కూడా నవ్వారు.

"అన్నింటి చారలూ ఒక్కలాగే ఉంటాయా మామయ్యా?" అడిగాడు కిట్టూ.

"అసలుండవు, మీకీ విషయం కూడా తెలిసి ఉండదు. ఒక మనిషి వేలిముద్ర ఉందనుకోండి. అది ప్రపంచంలో ఇంకెవ్వరి వేలిముద్రతోనూ కలవదు. వీటి చారల కథ అంతే. ఒక జీబ్రా చారల డిజైను మరే జీబ్రా డిజైనును పోలి ఉండదు."

"ఎంత చిత్రమో!" అంది సుమ.

"ఇంకా ఉన్నాయా సందేహాలు. ఐపోయినాయా?" మామయ్య పైకి లేస్తూ అడిగాడు.

*

# 4. తెల్ల ఏనుగులు

"మామయ్యా! మామయ్యా!" కిట్టూ చాలా వేగంగా హడావుడిగా పరిగెత్తుకొచ్చాడు మామయ్య దగ్గరకు.

ఆ వెనకే సుమ దూసుకు వచ్చింది.

ఇద్దరూ కలిసి గందరగోళంగా ఏదో అడుగుతున్నారు.

"ఆగండర్రా. ఎవరయినా ఒక్కరే మాట్లాడితే నాకు తెలుస్తుంది ఇద్దరూ కలిసి మాట్లాడితే ఏమి అర్థమవుతుంది? కిట్టూ నువ్వు చెప్పు అసలు సంగతేమిటో!" మామయ్య ప్రశ్న అడిగే ఛాన్సు కిట్టూ కిచ్చాడు.

"ఏనుగుకు ఎలుకంటే భయంకదా మామయ్యా?" అన్నాడు కిట్టూ వెంటనే.

"అత పెద్ద ఏనుగు చిన్న ఎలుక పిల్లను చూసి భయపడుతుందా?" కిట్టూ చెప్పింది తప్పు కదా మామయ్యా!..." సుమ కిట్టూ మాటలు ఖండిస్తూ అంది.

"ఆ మీరిద్దరూ అట్లా కూర్చోండి చెప్తాను..." అన్నాడు మామయ్య

"మా ఇద్దర్లో ఎవరు కరెక్ట్" ఆత్రంగా మళ్లీ ప్రశ్నించాడు కిట్టూ.



"చిట్టెలుకను చూసి ఏనుగు భయపడ్తుందన్న నమ్మకం ఉన్నమాట నిజమే. కానీ, ఆరోగ్యంగా ఉన్న ఏనుగు ఏ జంతువుకూ భయపడదు. ఏనుగులకు మనుషులకీ కరువు వచ్చినప్పుడు ఆహారం దొరకదు. కరువుకీ. నిప్పుకీ అవి భయపడుతాయి!...."

"మరి ఎలుక సంగతి?" కిట్టూ మళ్లీ వేశాడు ప్రశ్న.

"ఆ అక్కడికే వస్తున్నా ఎలుకకు ఏనుగు భయపడ్తుందన్నమాట రావ డానికి కారణం ఒకటై ఉండొచ్చు. పొరపాటునైనా ఏనుగు తొండంలోకి ఎలుక దూరితే ఊపిరాడదు అందుకు దానికి ప్రమాదమేమో అన్న ఉద్దేశం వల్ల అనుకుని ఉంటారు. చుట్టుపట్ల ఎలుకలున్నట్లయితే ఏనుగు ఆ వాసనని పసికట్టకలదు. కానీ అంతచిన్న జంతువునది అసలు పట్టించుకోదు..." మామయ్య చెప్పిన మాటలకు సుమ సంతోషంతో చప్పట్లు కొట్టింది.

"వాదే కరక్ట్. వాదే కరక్ట్" అంటూ.

కిట్టూ "అందరూ అనేమాట నేను అన్నాను అంతే!... పరేగాని మామయ్యా ఇంకో సందేహం తెల్ల ఏనుగులుంటాయా?" అన్నాడు.

"ఆం దీనికి ఓ తమాషా కథ ఉంది."

కథ అనేమాట రాగానే సుమ అడిగింది ఆత్రంగా "కథా? అది తొందరగా చెప్పవా మామయ్యా?"

"ఎవరైనా ఏమాత్రం ఉపయోగం లేని దాన్ని చాలా ఎక్కువ ఖరీదుతో కానీ, పోషించలేనిదాన్ని కొంటే అప్పుడు వాడు తెల్ల ఏనుగును సొంతం చేసుకున్నాడు అంటారు. అర్థమయిందా?"

"అంటే అసలు నిజానికి తెల్లరంగున్న ఏనుగులుండవా? కిట్టు ప్రశ్న

"ఆసియా ఏనుగులు చాలా తేలికరంగులో ఉంటై కనుక వాటినంటారు తెల్ల ఏనుగులని సయామ్‌లో (ఇప్పటి థైలాండ్) ప్రజలు. ఈ ఏనుగులను దైవంగా భావించి పూజ చేస్తారు. పూర్వం ఓ సయామ్ రాజు చేసిన పనివల్ల ఈ "తెల్ల ఏనుగు" పేరును పనికి రాని దానికి, పెద్దవస్తువును పోషించాల్సి వచ్చినప్పుడు వాడుతారు..."

"ఇంతకీ ఆ రాజు ఏం చేశాడేమిటి?" కిట్టూ అడిగాడు.

"సయామ్ రాజుకు ఓసారి తన ఆస్థానంలో ఉన్న ఒకడిపైన చాలాకోపం వచ్చింది. అప్పుడాయన ఆ మనిషికి శిక్షగా ఓ తెల్ల ఏనుగును బహుమతిగా

ఇచ్చాడు."

"ఇస్తే మంచిదేగా మామయ్యా! ఎంచక్కా పెంచుకోవచ్చు." సుమ సంబరంగా అంది.

"పిచ్చిపిల్లా! ఏనుగు పోషణ అంటే మాటలనుకున్నావా? బంధించి తీసుకువచ్చి పెట్టిన ఏనుగులను మేపడానికి ఎంతఖర్చవుతుందో తెలుసా?...."

"ఎంత?"

"రోజుకు సుమారు యాభైరూపాయలు దానికి పెట్టే ఆహారానికి అవుతుంది. అంటే ఒక సామాన్య కుటుంబీకుడికి బహుమతిగా ఏనుగు ఇస్తే అది మనిషి జీవితాన్ని నాశనం చేసినట్లే. మామూలు వాళ్లెవరికి ఏనుగు పోషణ సాధ్యంకాదు. అందుకే ఆ రాజు ఏనుగును బహుమతిగా ఇచ్చి శిక్షించాడన్న మాట ఆ వ్యక్తిని...." మామయ్య చెప్పిన మాటలను కుతూహలంగా విన్నారిద్దరూ!

కిట్టూ ప్రశ్నలింకాపూర్తవలేదు. "మామయ్యా! గజాననుడు అని వినాయకుడ్ని ఎందుకంటారు?" అన్నాడు.

"వినాయకుడి మొహం ఏనుగు మొహంలా ఉంటుంది. అందుకని అంటారు. ఆ ... ఇప్పుడు ఏనుగు తొండం గురించి చెప్తాను. ఏనుగు తొండాన్ని ఎంత ఎక్కువగా ఉపయోగిస్తుందంటే ఏ జంతువూ తన శరీరంలో ఏ భాగాన్ని అంతగా ఉపయోగించదు. చిత్రమేమిటంటే ఏనుగు తొండం ఎంత సున్నితంగా ఉంటుందో అంత బలంగానూ ఉంటుంది."

"వాలాంటి వాళ్ళను తొండంతో తేలిగ్గా ఎత్తి విసిరెయ్యగలదు కదు మామయ్యా!" సుమ అంది.

"సునాయాసంగా ఎత్తివేస్తుంది. తొండంతో ఏనుగు పెద్దచెట్టును బలంగా ఎట్లా పెళ్లగించగలదో, చిన్న పిల్ల చేతిలో ఉన్న బఠాని గింజనంత తేలిగ్గా తీసుకోగలదు..."

"భలే, భలే" అంది సుమ ఆనందంగా, నిజంగానే ఏనుగు తనచేతిలోంచి బఠాణీ గింజ తీసుకుని తిన్నంత ఆనందపడిపోతూ.

"తొండంతో ఇంకా ఏమేం చేస్తుంది ఏనుగు?" కిట్టూ అడిగాడు.

"ఏనుగు తొండంతో వాసన చూస్తుంది. తాగుతుంది. ఎక్కడైనా ఏదైనా ఆహారం చూస్తే దాన్ని తొండంతో పట్టుకుని నోట్లో

పెట్టుకుంటుంది."

"మరి మంచినీళ్లెట్లా తాగుతుంది?" సుమ అడిగింది.

"ఏనుగు తొండంతో పీల్చుకున్న నీళ్లు ఏకంగా తాగదు. తొండంతో పీల్చుకున్న నీళ్లను నోట్లోకి వదిలిన తరవాత పెద్దశబ్దం చేస్తూ నోటితో తాగుతుంది. ఏనుగు చాలా బలమైన జంతువు. దాని చర్మం చాలా దళసరిగా ఉంటుందనుకుంటారుగానీ చాలా సున్నితంగా ఉంటుంది. దాని చర్మం ఒక అంగుళం మందంగా ఉన్నా దాని చర్మం కింద కొవ్వు ఉండదు. అందువల్ల అది ఎక్కువ చలినిగానీ, ఎక్కువ వేడినిగానీ భరించదు..."

"మరి ఎక్కువ వేడి ఉన్నప్పుడు లేదా చలిగా ఉన్నప్పుడు ఏనుగు ఏంచేస్తుంది?"

"కప్పుకోడానికి పాపం వాటికి బట్టలు కూడా ఉండవు మామయ్యా?" జాలిగా అన్నాడు కిట్టూ.

"ఏ జంతువుకు మాత్రం బట్టలు ఉంటాయి? సహజంగా వాటికొక అలవాటుంటుంది."

"వాతావరణంలో బాగా వేడి ఉన్నప్పుడు ఏనుగు తొండంతో నీళ్లు తీసుకుని మీద చల్లుకుంటుంది."

"ఏనుగు ఒకసారి తన తొండంతో ఒకటిన్నర గ్యాలన్ల నీరు నింపుకో గలదు. ఇంకా ఏనుగు తన తొండం ద్వారా వస్తువు ఆకారం. అది వేడిగా ఉందా, చల్లగా ఉందా, గరుకుగా ఉందా, నునుపుగా ఉందా ఇవన్నీ తెలుసుకుంటుంది. ఏనుగులు పోట్లాడుకున్నప్పుడు వాటి తొండాలతోనే పోట్లాడుకుంటాయి." 

"ఓహ్! నాకు ఏనుగులు పోట్లాడుకుంటే చూడాలని ఉంది." కిట్టూ ఉత్సాహంగా అన్నాడు.



"మొన్న సర్కస్‌లో ఏనుగు ఎన్నిరకాల ఫీట్లు చేసిందో ..." కళ్లు విశాలం చేసి అంది సుమ. 

"మనం సాధారణంగా ఏనుగును ఎక్కువగా చూసేది సర్కస్‌లోనే. అంటే పట్టణాల్లో అవి అంతగా వచ్చే అవసరం ఉండదు. మనం అడవుల్లోకి వెళ్లం కదా!..." అన్నాడు మామయ్య.

"మామయ్యా! తప్పు తప్పు..."

"ఏమిటి తప్పు" అన్నాడు మామయ్య అర్థం కానట్లు.

"జూలో ఉంటాయి మామయ్యా ఏనుగులు" అంది సుమ నవ్వుతూ.

"ఆఁ మర్చేపోయాను. కరెక్టమ్మా! ఇంకొక్క వింత సంగతి చెప్పి ఇవాళ్టికి ముగిస్తాను..."

"ఏమిటో..."

"ఏనుగు తొండానికి ఎముకలులేవు. కానీ దాన్లో నలభైవేల వివిధ రకాలయిన కండరాలుంటాయి. ఏనుగు దంతాలతో చాలా అందమైన బొమ్మలూ అవీ చేస్తారు. అవి చాలా ఖరీదుగా ఉంటాయి..." అన్నాడు మామయ్య టైము చూసుకుని లేస్తూ.

"ఆ నేనూ చూశాను" అని కిట్టూ అంటే తానూ చూశానంది సుమ.

ఈ లోపల వాళ్ళమ్మ పిలవడంతో లోపలికి పరుగెత్తారిద్దరూ. *

# 5. పిల్లి

" సుమా ఇట్రా..." ఆడుకుంటున్న సుమని పిలిచాడు కిట్టూ.

"ఏమిటో తొందరగా చెప్పు నేను ఆడుకోవాలి" సుమ ధ్యాసంతా ఆట మీదే ఉంది. "చెప్తాను రా," అంటూ ఇంట్లోకి లాక్కు వెళ్లాడు. బాగా చీకటిగా ఉన్న సామాను గది దగ్గరకు తీసుకెళ్లి "అదిగో చూడు" అన్నాడు కిట్టూ. అసలు ఆ గదిలోకి వెలుతురే గాదు. లైటు వేసుకుంటే కానీ పనిచేసుకునే వీలుండదు. పైకి అటక మీదికి వేలు పెట్టి చూపించాడు.

ఆ చీకట్లో మెరుస్తున్న రెండు కళ్లు చూపి హడలిపోయింది సుమ.

"ఏమిటది?" అంది

"అదే పులి..., పులి" అన్నాడు కిట్టూ సుమని ఏడ్పించే ఉద్దేశంతో...

"ఏం కాదు నేనేమన్నా పిచ్చిదాన్నా? పులులు ఇక్కడ ఎందుకు ఉంటాయి- ఇంట్లోకి ఎట్లా వస్తాయ్?...."

"మరి అట్లా మెరిసేదేమిటో- అది నీమీద పడ్తుంది జాగ్రత్త..." కిట్టూకి సుమని ఏడిపించడం సరదా!



"అమ్మా! కిట్టూ చూడు, ఎట్లా అంటున్నాడో..." అని రాగం లంకించుకునే సమయానికి మామయ్య వచ్చాడు "ఏమిటి గొడవ?" అంటూ.

సుమ కిట్టూ మీద ఫిర్యాదు చేసింది ఏడిపిస్తున్నాడంటూ.

ఇద్దరూ ఓ నిమిషానికి రాజీకి వచ్చాక సామాను గదిలో మెరుస్తున్న కళ్లను చూపించాడు కిట్టూ.

"అది పిల్లి" అన్నాడు మామయ్య. "నాకు తెలీక పోతేగా" అంది సుమ.

"ఆ తెలుసులే, అన్నీ గొప్పలే" అన్నాడు కిట్టూ ఎగతాళిగా.

"పోన్లేరా అది చిన్న పిల్ల! ప్రతి దానికీ తగవులాడుకో కూడదు. ఆటలాడుకోవాలి. వెళ్లండి" అన్నాడు మామయ్య.

"మామయ్యా! మామయ్యా! పిల్లి కళ్లు ఎందుకట్లా మెరుస్తాయ్!" అడిగాడు కిట్టూ మామయ్యను ఆపేస్తూ.

"ఊఁ ఒక ప్రశ్న వేశావూ అంటే ఇంక ఆపేశావన్నమాట!... ఏదీ, నాకో గ్లాసుతో మంచినీళ్లు తీసుకురా చెప్తాను..." అన్నాడు.

కిట్టూ క్షణంలో మంచినీళ్ళు తెచ్చాడు.

"నిజానికి మనకళ్ల నిర్మాణం కూడా అట్లాగే ఉంటుంది. పిల్లి కళ్లు మెరవడానికి కారణం కాంతి పరావర్తనమే! అంటే సైన్సు ప్రకారం, మన కళ్లయినా, పిల్లి కళ్లయినా ఎక్కువ కాంతికి కంటి పాపలు కుంచించుకుంటాయి. అయితే రాత్రిళ్ళు చీకట్లో కంటిపాపలు తక్కువ వెలుగులో అన్నీ చూడగలిగే విధంగా బాగా తెరుచుకుంటాయి..."

"కానీ పిల్లి కళ్లు అంతగా చీకట్లో మెరవడానికి కారణం లోపల కంటిలోకి వెళ్లిన కాంతి అక్కడ ఉండే పొరల్లోని కణాల వల్ల పరావర్తనం చెందుతుంది. ఇవి ఎరుపు, బంగారు రంగు, నీలం లేదా ఆకుపచ్చ రంగులో ఉంటాయి."

"దానివల్ల ఏం జరుగుతుంది?"

"అదే చెప్తున్నాగా, బయటి కాంతిలో మార్పు వచ్చినప్పుడు పొరల్లోని

కమాలు దాన్ని టోపెటమ్ అంటారు. ఈ టోపెటమ్ ఒక అద్దం-లాగా పనిచేసి అనేక రంగుల్లో పరావర్తనం చెందేట్లు చేస్తుంది. దీనివల్ల పిల్లికి ఒక కొత్త సామర్థ్యం వస్తుంది. అదేమిటంటే చీకట్లో కూడా ఇంకా ఎక్కువ శక్తిమంతంగా చూడగలగడం. మామూలుకంటే ఆ శక్తి ఏడు రెట్లు ఎక్కువ. ఇది మనిషికి చాలా తక్కువ..." చెప్పాడు మామయ్య.

"అంటే పిల్లి చీకట్లో కూడా మనకంటే చాలా బాగా చూడగలదన్న మాట! కదు మామయ్యా!" అంది సుమ.

"అవునమ్మా! కరెక్ట్! ఇకపోతే సాధారణంగా ఎక్కువ పిల్లుల కంటిలో ఉండే కనుపాప రంగు నీలం. ఆకుపచ్చ పసుపు పచ్చ లేదా నారింజ పండు రంగులో ఉంటుంది. కానీ కొన్ని పిల్లులు అట్లా ఉండటం చాలా తక్కువ కానీ రెండు కళ్లల్లో వేరు వేరు రంగులు కూడా జరుగుతుంది..."

"చాలా తమాషా కదు మామయ్యా!" అన్నాడు కిట్టూ తన ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"పిల్లికి తొమ్మిది జన్మలుంటాయుట కద మామయ్యా. మా ఫ్రెండ్ చెప్పింది. నిజమేనా?" అంది సుమ.

"లేదమ్మా! అవన్నీ పిట్ట కథలు. అన్ని జంతువుల్లాగే పిల్లి ఒక ఝే!"

"పిల్లి ఎన్నాళ్లు బతుకుతుంది మామయ్యా" కిట్టూ అడిగాడు.

"సాధారణంగా పిల్లులు 14, 15 ఏళ్ళు బతుకుతాయ్. కొన్ని పిల్లుల జీవితకాలం 30 ఏళ్ళు కూడా ఉంటుంది. ఐతే పిల్లి ఎంత అపాయకరమైన పరిస్థితి వచ్చినా తేలిగ్గా తప్పించుకుంటుంది. వాటికి జ్ఞాపకశక్తి ఎక్కువ. దృష్టి బాగుంటుంది. చెప్పలేనంతగా, అంటే అమితంగా వాసన తెలుసుకునే శక్తి, వినికిడి శక్తి ఉంది. అందువల్ల ఎటువంటి ఆపద సంభవించినా తేలిగ్గా తప్పించుకోగలుగుతుంది. అందువల్ల దానికి తొందరగా ఏ బాధా కలగదు..."

"మామయ్యా! పిల్లి కళ్లు మూసుకుని పాలుతాగుతూ తన్నెవరూ చూడటం లేదు- అనుకుంటుందంటే ఏమిటి?" కిట్టూ ప్రశ్నించాడు.

"పిల్లి కళ్లు మూసుకునే పాలు తాగుతుంది - పాలు తాగడం దొంగతనంగా కనక తననెవరూ చూడటం లేదనుకుంటూ నిశ్చింతగా తాగుతుంటుంది. ఎవరూ తనను చూడటం లేదనుకుని తప్పు చేస్తున్నప్పుడు ఈ మాట అంటుంటారు" అన్నాడు మామయ్య కిట్టూ ప్రశ్నకు

సమాధానంగా.

కిట్టూ, సుమ - ఇక ఇవాళ్టికి మామయ్యతో తమ పని ఐపోయిం దన్నట్టుగా మెల్లగా జారుకున్నారు. - మామయ్య నవ్వుకున్నాడు.
*



# 6. కొండ చిలువ

కిట్టూ మామయ్యదగ్గరికిచేరి "మామయ్యా! చెట్టెక్కే చేపలు ఉంటాయా?" అనిఅడిగాడు.

"ఆ నువ్వు చిలిపిగా అడిగావేమో కానీ ఉంది - చెట్టెక్కే చేప. ఆస్ట్రేలియాలో నడిచే చేప ఒక అపురూపమైన జీవి. నీళ్లల్లో ఇది ఇతర చేపల్లాగా ఈదుతుంది. మొప్పలనే కాళ్లలాగా ఉపయోగించి నేలమీద నడుస్తుంది అంతేకాదు. చెట్టుమీదికి కూడా పాకి కింది కొమ్మలమీద గంటలకొద్దీ గడుపుతుంది. తేరగా దొరికిన చిన్నచిన్న కీటకాలను కూడా భోంచేస్తుంది" అంటూ నవ్వాడు మామయ్య.

"మామయ్యా! మరే ఇన్ని చిత్రాలు చెప్పావుకదా! ఏ జంతువైనా మరో జంతువును చంపి తినడం కాకుండా ఉన్నపాటున మింగేయ గలదా?" కిట్టూ ప్రశ్నించాడు.

"మనదేశంలో కొండచిలువలు కుందేళ్లలాంటి జంతువులను ఉన్నపాటున మింగేస్తాయి కానీ ఈ విషయంలో దక్షిణ అమెరికాలోని రాకాసి చిలువకు ఇదేదీ సాటిరాదు.

"అక్కడ దాన్ని అనకొండ అని పిలుస్తారు. ఇది 28 అడుగుల పొడవు.



200 పౌన్ల బరువు ఉంటుంది. దాని చుట్టుల్లో బిగిసిన ప్రాణి ఉక్కిరి బిక్కిరై నిమిషాల్లో చచ్చి ఊరుకుంటుంది. ఆ పైన దాన్ని మింగడం మొదలుపెడుతుంది. దాని కండరాల్లోంచి లోపలికి పోయేప్పుడు ఆ వత్తిడికి జంతువు ఎముకలు కూడా విరిగిపోతుంటాయి. మింగేప్పుడు జంతువు ఉన్నచోటు ఉబ్బుగా బయటకు కనిపిస్తూ వెనక్కు జరుగు తుంటుంది."

"బాబోయ్! వింటేనే భయమేస్తోంది. సరే కానీ మామయ్యా, ఈరోజుకు మా ఆఖరి ప్రశ్న- తన బరువుకన్నా ఎక్కువరెట్లు బరువు భరించగలది ఒంటేనా? ఇంకేమన్నా ఉందా?" కిట్టూ సవాల్ విసిరాడు.

"అబ్బే! ఒంటె అసలు లెక్కకే రాదు. బరువనగానే మీకు ఏనుగో, గుర్రమో మనసుకు వస్తుంది. కానీ కిట్టూ! నీ ప్రశ్నకు జవాబు ఒక చిన్న కీటకం అని చెప్తే నువ్వు నమ్ముతావా?" అన్నాడు మామయ్య.

"కీటకమా, ఏమిటదీ?" ఆశ్చర్యంగా అడిగాడు కిట్టూ. సుమ కూడా ఇదేం చిత్రమన్నట్లు చూసింది మామయ్యవేపు.

"అంగుళంలో పదహారవ వంతు నుండి రెండు అంగుళాలు ఉంటుంది"

"ఏమిటి?"

"వేర్వేరు రకాల చీమల పొడవు. వాటి ప్రమాణం ఎంత వున్నా తన బరువుకు యాభై రెట్ల బరువును కూడా చీమ లాక్కుపోతుంది. ఆశ్చర్యం ఏమిటంటే చీమకు ఎక్కడా ఎముక అనేది ఉండదు. గట్టి దవడలు మాత్రం ఉంటాయి. ఆకులు, గింజలతో మొదలుపెడితే మొసళ్లు, సింహాల శరీరాలదాకా కొరికి పెద్ద బరువుల్ని ఈడ్చుకుపోతాయి. చీమలదండుచేరి మొసళ్లను, సింహాలను పట్టి చంపిన కథలు కూడా ఎన్నో ఉన్నాయి."

"అందుకేనా మామయ్యా! బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చావదె సుమతీ! అన్నారు" అన్నాడు కిట్టూ.

" ఆ పద్యం నాకూ వచ్చు మామయ్యా" అంది సుమ.

ఆఁ భేష్! అదే మరి. తనకన్న యాభై రెట్ల బరువును దవడలతో పట్టి ఈడుస్తుందంటే ఆ లెక్కన 175 పౌన్లు బరువున్న వస్తాదుకు చీమంత బలమే ఉంటే అతడు నాలుగు టన్నుల బరువును తన పండ్లతోనే పట్టి అమాంతం లేపగలిగే వాడన్నమాట."

"భలే బాగుంది మామయ్యా! జంతు ప్రపంచమంటే ఏమో అను కున్నాం. ఇవాళ నువ్వుకూడా చాలా సంగతులు... ఎన్నో వింతలు విడ్డూరాలు చెప్పావు" సంతోషంతో అన్నాడు కిట్టూ.

"మీరు ఈ మామయ్యకు పెట్టిన పరీక్ష తక్కువదా? మీరే చెప్పించా రివాళ అన్నీ! అదిగో అమ్మ పిలుస్తోంది మీరు వెళ్లండి. నాకు పనుంది" అంటూ లేచాడు మామయ్య. *

# 7. ఊసరవెల్లి

మామయ్యా! మామయ్యా! ఊసరవెల్లి అంటే ఏమిటి?" బయటికి వెళ్ళిపోతున్న మామయ్య చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు కిట్టూ.

"నేను పనిమీద బయటికి వెళుతున్నాను. వచ్చాక చెపుతాను...." అన్నాడు వెళ్ళబోతూ మామయ్య.

"అహో అసలదేంటో, ఎట్లా ఉంటుందో చెపితేగానీ వదిలిపెట్టను." అన్నాడుమొండిగా కిట్టూ.

"అబ్బా! కిట్టూ! నువ్వు మరీ మొండివాడవవుతున్నావురా...."

"ఆ లేకపోతే మాకు సంగతులన్నీ ఎట్లా తెలుస్తయ్యేమిటి? అయినా నువ్వు అర్జంటుగా ఏం వెళ్ళక్కరలేదనినాకుతెలుసులే....."అన్నాడు కిట్టూ.

"మధ్యలో అదేంటి నేనెక్కడికి వెళ్ళేదీ నీకేం తెలుసు!" అన్నాడు మామయ్య.

"సాయంత్రం కాగానే నువ్వు వెళ్ళేదిలైబ్రరీకేగా అక్కడ పుస్తకాలు చదివి ఎన్నో విషయాలు నేర్చుకుంటావ్. నేను చెప్పింది కరక్టేకదూ?"

కిట్టూ ఆరిందాలా అన్నాడు.



మామయ్య నవ్వాడు. "నువ్వు చెప్పింది నిజమే నాకు లైబ్రరీలోకూర్చుంటే ఓ గుడిలో కూర్చున్నట్లు ఉంటుంది. అదొక విజ్ఞాన ప్రపంచం. అదొక సరస్వతీ మందిరం...."

"మామయ్యా! నేనడిగింది వదిలేసి ఏదో చెపుతున్నావ్ ఊసరవెల్లి అంటే...."

"ఇంతకీ ఆ మాట ఎక్కడ విన్నావుట...." అన్నాడు మామయ్య. అక్కడ సోఫాలో కూర్చుంటూ

"ఇందాక అమ్మ ఎవరిగురించో అంటుంటే విన్నాను. ఏమిటి ఆవిడ ఊసరవెల్లిలా రంగులు మారుస్తుందీ" అని అడిగాడు కిట్టూ.

"ఊసరవెల్లి అంటేఏమిటి? అది రంగులు మార్చడమేమిటి? అదేగా మీ సందేహం...." మామయ్య అందుకున్నాడు. "నాకు అదే సందేహం" అంటూ సుమ వచ్చేసింది.

"వచ్చావా, రామ్మారా" అంటూ సుమను పక్కన కూర్చోబెట్టుకున్నాడు మామయ్య.

"ఊసరవెల్లి, తొండ, - ఇవన్నీ ఒక జాతికి చెందిన జంతువులు. ఊసరవెల్లి రంగు పరిసరాలను బట్టి, వెలుతురునుబట్టి, దాని మానసికస్థితిని బట్టి మారుతుంటుంది. ఒకేరకంగా ఉండకుండా దాని ఒంటి రంగు మారుతుంటుంది కనుకనే చంచలస్వభావం ఉన్నవాళ్ళని ఊసరవెల్లితో పోల్చడం జరుగుతుంటుంది."

"ఓహో అదన్నమాట విషయం. మరి ఆ ఊసరవెల్లి అసలు రంగేమిటో" కిట్టూ అడిగాడు.

"ఎక్కువగా ఊసరవెల్లుల రంగు గోధుమ రంగుగానీ, లేతాకు పచ్చరంగుగానీ ఉంటుంది. ఇక అది మార్చే రంగు లేకుంటే కొంచెం తక్కువ తెలుపు. పసుపు లేదా లేతాకు పచ్చ. ఊసరవెల్లి పరిసరాల్లో చల్లదనం ఉన్నప్పుడు లేలికరరంగు కలిగిఉంటుంది. అదే వెచ్చగా ఉండే వేళల్లో గాఢమైన రంగు ఉంటుంది."

"అది రంగులు ఎట్లా మారుస్తుంది?...." సుమ ప్రశ్నించింది.

"ఊసరవెల్లి చర్మం చాలా పొరలను కలిగి ఉంటుంది. దాని ప్రతి పొరలోనూ రకరకాలయిన రంగులు కలగచేసే సెల్స్ ఉంటాయి. దానిలోపలి చర్మం పొరలో నలుపు రంగు కలిగిన వర్ణద్రవ్య కాలుంటాయి. ఈ రంగు

కణాల సంకోచ వ్యాకోచాలను ఊసరవెల్లి నాడులు నియంత్రిస్తుంటాయి. దానిలో ఉండే నలుపురంగు కణాలు ఒకదానికొకటి దగ్గరగా వచ్చినా, లేదా చర్మతలంమీద దూరంగా పోయినా మిశ్రణం పొంది రసాయనిక్రియ జరుపుతుంది. అప్పుడు చర్మంమీది రంగులో మార్పు వస్తుంది."

"చాలా పెద్ద కారణమే ఉందన్నమాట! రంగు మారడానికి..." అన్నాడు కిట్టూ.

"ఇకపోతే ఊసరవెల్లి నాలుక గురించి చెపుతాను. అది తినవలసిన పురుగేదయినా కనిపించినప్పుడు నాలుక చాపి పురుగును పట్టేస్తుంది. ఆ నాలుక ఎంతదూరం చాపుతుందో తెలుసా?"

"ఎంతదూరం? " ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"తన శరీరానికంటే రెట్టింపు దూరం చాపి తాను తినదల్చుకున్న పురుగును అందుకుంటుంది."

"దాని నాలుక అంత పొడుగ్గా ఉంటుందన్నమాట..." సుమ ఆశ్చర్యంగా అంది. "ఊc! చెప్పానుకదా! ఒక్కో జీవికీ ఒక్కో రకమైన ప్రత్యేకత ఉంటుంది. ఇంకో గంటలో లైబ్రరీ మూసేస్తారు. నేను లైబ్రరీకి వెళ్లొస్తాను" అంటూ హడావుడిగా కదలిపోయాడు మామయ్య. *